# జగన్నాటకం

[ గీతాలు : గేయాలు ]

నా. ర్ల వెంకటేశ్వరరావు



ప్రథమ
1,000
మే.

ప్రతులకు:
నార్లవారు
4, పైక్రాఫ్ట్స్ ఫస్ట్ స్ట్రీట్
రాయపేట : : మద్రాసు 14

చిరంజీవి
కానూరి లక్ష్మీనారాయణ ప్రసాద్ కు
అనురాగంతో, ఆశీస్సులతో



ముద్రణ
ప్రతులు
1957

# అనుక్రమణిక

# పరిచయం

కవిగా నన్ను మీకు ఈ గేయసంపుటి పరిచయం చెయ్యాలి. అట్టి సంపుటిని మీకు పరిచయం చేయడానికి నే నెవరిని ?

—నార్ల

# వెన్నెల

ఇంపు వెన్నెల
అంపు వెన్నెల
అందములు చిందించు వెన్నెల

ఇగురు వెన్నెల
తొగరు వెన్నెల
జగములను రగిలించు వెన్నెల

లేత వెన్నెల
పూత వెన్నెల
కైతలను కదలించు వెన్నెల

పగల వెన్నెల
తొగల వెన్నెల
నగములను నవ్వించు వెన్నెల

తరల వెన్నెల
కెరలు వెన్నెల
కెరటముల క్రీడించు వెన్నెల

ఇంపు వెన్నెల
సొంపు వెన్నెల
తాంపముల కంపించు వెన్నెల

నిండు వెన్నెల
పండు వెన్నెల
పండుగను పలికించు వెన్నెల

పిండి వెన్నెల
వెండి వెన్నెల
గుండెలను పండించు వెన్నెల

పాల వెన్నెల
పూల వెన్నెల
కాలమును కరగించు వెన్నెల

తేన వెన్నెల
సోన వెన్నెల
మానవుని మంత్రించు వెన్నెల

# ఓ మానవా !

చిత్రం, బహుచిత్రం !
చిత్రాతివిచిత్రం ! !

ఆరని, చల్లారని
ఆసల, పేరాసల
సుడిగుండంబులలోకే
పడిగా, పడిపడిగా
జలధానికిపతనె
వలతాలం పరుగులు !

చిత్రం, బహుచిత్రం !
చిత్రాతివిచిత్రం ! !

అందని, చూపొందని
ఆపర, ప్రేమావర
విభవవ్యోమాలకు
విడిగా, విడివిడిగా
సంపాతికిపతనే
సతత మిత్ర పయనం !

హాస్యతోరం,
నుస్తృషయాకం.
అంధకారం, గా
ఢాంధకారం

పొంగిన సంద్రం.
పొర్లు సంద్రం,
మ్రోగిన తీరం, మా
ర్మోగిన పారం

# కన్నెలు

మింటమెరిసే కొంటె చుక్కలు
కవులు చెప్పే కన్నెలైతే—
కన్నుగీటే తెన్ను వాటికి,
వెక్కిరింతల వెల్గు వాటికి

తెల్లబోయే మల్లెమొగ్గలు
కవులు చెప్పే కన్నెలైతే—
తగని సిగ్గుల తెగలు వాటికి,
నిగనుదాటని ముసిమి వాటికి

నింగి త్రుళ్ళే నీలిమబ్బులు
కవులు చెప్పే కన్నెలైతే—
విరియబోసిన కురులు వాటికి,
వల్లమాలిన వగలు వాటికి

కొలను వెల్గుల కలువపువ్వులు
కవులు చెప్పే కన్నెలైతే—
నీటి నీడల నిక్కు వాటికి,
మేటినవ్వుల గోటు వాటికి

కొమ్మదాగే కోయిలమ్మలు
కవులు చెప్పే కన్నులైతే....
పన్నెచిన్నెలు ఉన్న వాటికి,
గుండెకోతలు మెండు వాటికి

# శైశవ హృదయం

"చంపంగ నేలరా చలిచీమ నీవు ?
చెడుగు నీ కది యేమి చేసెరా తండ్రి !"

"అమ్మోయి ! మరిగత్తె ఆ చీమ నన్ను
కరిచింది గట్టిగా కరిచింది రేపు !"

"కాంతమ్మ తెచ్చింది గారెతుం పొకటి,
తిరిగి తెమ్మంటేను తేలేను, బాబు !"

"చేరింది చూరులో చిన్నారిపిచిక,
అడగవే అదికూడ అప్పచ్చి తెచ్చు !"

"బొగ్గు గీతలు - అయ్యొ - ముగ్గు పూతలును,
మరి కేలరా నీకు ముఖము నిండుగను ?"

"బొగ్గుగీతలు కావె - బుగ్గమీసాలు,
ముగ్గుపూతలు కావె - ముసలి గడ్డాలు !"

# ఆగస్టు - 15

కూటికి గుడ్డకు
    లోటులు తప్పక
లెక్కకు మించిన
    చిక్కులె వున్నా.
రేపటి చింతలు
    రేయిని నిద్రను
దూరము చేయగ
    భారముగా మన
బ్రతుకులె వున్నా.
    గతుకే తోవని
గుండెలు గుబగుబ
    కొట్టుకులాడే
సమయము లున్నా.
    చంపల ముందిక
మంచిని, చెడ్డను
    మదిలో నెంచుక
తరచగ సైతే
    తప్పక - అన్నా !

తేట తెల్లముగ
తెలియును సుమ్మీ !
దేశపు దాస్యము
తీరిన దినమే,
స్వారాజ్యభాగ్యము
బడసిన దినమే,
జగతిని మన మొక
జాతిగ మన్నన
గాంచిన దినమే
కమనీయమ్మగు
పర్వదినమ్మని....
సర్వవిధమ్ముల
స్మరణీయంబగు
స్వర్ణదినమ్మని....

స్వారాజ్యసంపద
సద్వినియోగము
కాగల దక్షత
కరవై పోతే,
నిందను మనమే
అందరిమధ్యను

సంప్రదాయికమే
    శాస్త్రం అన్నా!

మన లోపంబులు,
    మన పాపంబులు
స్మరణము చేయక,
    సంకుచమతులమై
పరదాస్యమ్మును
    బాపిన విప్లవ వి
నమ్మును తిట్టిన
    నాశము కోరితి
తప్పు, తప్పు,
    తప్పు — అన్నా!

పంచతాదిగా
    వత్సరములలో
మెరుపు పగిదిని
    పెరుగు పోయిన
పీడలు, చీడలు,
    కీడులు, గోడులు

తొందరగా నెటు
　　తొలగును – అన్నా ?

నిండుగ నదిలో
　　నీరము లుంటే
పండునె – అన్నా !
　　పంట లన్నియును ?
చేలకు వాటిని
　　చేర్చినమీదట
రేయింబవలును
　　రెక్కల కష్టము
చేసినవానికె
　　చెందును – అన్నా !
బంగరు పంటలు,
　　భాగ్యపురాశులు !
కాల్వలు తీయక,
　　కష్టము చేయక
స్వరాజ్యపదియును
　　సత్ఫల మివ్వదు....
కర్మభూమినే,
　　ధర్మవారినే

పెరుగును - అన్నా!
సిరిసంపత్తులు!

కొండల మందక
తంపర లాడక
పందెపు గుఱ్ఱము
పగిదిని ముందుకు
సాగుము, సాగుము,
సాగుము - అన్నా!
దూరపు చూపులు,
ధారపు నడకలు
కావలె నన్నా
కామితసిద్ధికి!

సమష్టిలక్ష్యము,
సౌభ్రాతృత్వము
ముఖ్యం బన్నా
సౌఖ్యావాప్తికి!

రాజువు నీవే,
రాజ్యము నీదే—
కలసికట్టుగా,
మలచినట్టుగా

ధావికి మెట్టులు
తీవిగ పెట్టుము !

రాజువు నీవే,
రాజ్యము నీదే——

పూనినట్టుగా,
తేనెపట్టుగా
సమతాసౌధము
చక్కగ కట్టుము !

హెచ్చు తగ్గులను
మచ్చమాప నీ
నడుము కట్టగా
నిడుములు తొలగును !

కరవు కాటకము
తరిమివేయ నీ
హలము పట్టగా
కలుములు కలుగును !

ధ్యేయము మరవక,
న్యాయము తప్పని
పథమును మెట్టిన
కథయే మారును !

అప్పుడె-అన్నా !
   అందరు జనులకు
కలుగును సౌఖ్యము !
   వెలుగును శాంతులు ! !
నూతన జగతిని
   నూతన సంఘము
స్థాపనచేయగ
   స్వరాజ్య మున్నది :
రేపటివారికె
   రేయిని పగలుగ
మహితాత్ముడవై
   మార్చుము - అన్నా !
సార్థక మప్పుడె
   స్వరాజ్యసిద్ధికి !
ధన్యము, ధన్యము,
   ధన్యం బప్పుడె
భరతక్ష్మాతల
   పౌరుల జన్మము ! !

[1952]

# ఆ వ లి

ముద్దుపాప నిద్దురలో
తొంగిచూచి దోగాడే
చిరునవ్వుల కెరటమ్ముల
కావల నేమున్నదో !

అరమోడ్పుల అక్షులలో
ప్రభారోచి ప్రభవింపగ
సాగే పటుయోగనిష్ఠ
కావల నేమున్నదో !

నీలాభ్రము, నీలాద్రుల
కమ్మని బిగికౌగిలిలో
కరగే శీకరసీమల
కావల నేమున్నదో !

విభావరీ ప్రభాతాల
ప్రత్యహ పరివర్తనలే
కీలకమౌ కాలోదధి
కావల నేమున్నదో !

కవినో నా కల్లోల మ
నోవీథుల నూపే భీ
తావహ వాతావరణము
కావల నేమున్నదో !

# గ రి క

పిరికి పిరికి ఓ గరికా !
పిచ్చితల్లివే గరికా !!

ఒదిగి ఒదిగి,
నేల
కదిసి కదిసి,
గాలి
జెదరి చెదరి,
ఏల
బెదరెదవే ?

పిరికి పిరికి ఓ గరికా !
పిచ్చితల్లివే గరికా !!

పెరుగు పెరుగు
కొసలు
కొరికి కొరికి,
పసులు
కరము కరము
విసుగు
పరచునటే ?

పిరికి పిరికి ఓ గరికా !
పిచ్చితల్లివే గరికా ! !

తలకి తలకి,
నిదుర
కలగి కలగి,
మదిని
అలియ సలియ,
సొదలు
తొలగునటే ?

పిరికి పిరికి ఓ గరికా !
పిచ్చితల్లివే గరికా ! !

తడవ తడవ
వెతలు
పడక పడక,
గతులు
వెదక వెదక,
బ్రతుకు
గడచునటే ?

పిరికి పిరికి ఓ గరికా !
పిచ్చితల్లివే గరికా ! !

పెరిగి పెరిగి,

ఏదో

తరిగి తరిగి,

ఎటెటో

మురిగి మురిగి,

ఎల్లి

రగులుకుంటే!

పిలిచి పిలిచె ఓ గరికా!

పిచ్చితల్లివే గరికా!!

నలిగి నలిగి,

గరిమ

తొలగి తొలగి,

మరల

చెలగి చెలగి,

పరల

గలుపుగదే!

పిలిచి పిలిచె ఓ గరికా!

పిచ్చితల్లివే గరికా!!

# నామధేయ మేదైనా...

అశ్వినో, భరణో,
అనూరాధో;
నామధేయ మేదైనా
నక్షత్రాలే అన్నీ--
నవ్వి, నవ్వించడానికి;
దవ్వునుంచి కవ్వించడానికి;
నింగి పందిరిపై పతె
నీ గుండెలో
బొండు మల్లెలు దండిగా
పండించడానికి;
కాటుక చీకటిలో
కోటీర మణిదీపా లొక
కోటి వెలిగించడానికి !
పుష్యమో, పునర్వసో,
పూర్వాషాఢో :
నామధేయ మేదైనా
నక్షత్రాలే అన్నీ
నింగి దిక్కులో
పొంగిపోగలవానికి !!

# సాఫల్యం

చీరచెంగున
చేరినప్పుడె
సరిగపోగుకు
సొగసులైనా, తీరులైనా!

కంఠసీమను
కదిసినప్పుడె
రత్నమాలకు
రంగులైనా, పొంగులైనా!

వేణిపై అర
విచ్చినప్పుడె
సన్నజాజికి
పన్నెలైనా, చిన్నెలైనా!

అరుణరాగము
అమరినప్పుడె
కొండకోనలకు
కులుకులైనా, పులకలైనా!

వెలుగురిక్కలు
విరిసినప్పుడె
అంబరానికి
హారమైనా, హర్షమైనా !

మావికొమ్మల
మసలినప్పుడె
కోకిలమ్మకు
కూతలైనా, కైతలైనా !

శిల్పిచేతికి
చిక్కినప్పుడె
చలువరాతికి
చలనమైనా, చెలువమైనా !

కవుల ఊహల
కదిపినప్పుడె
తేటమాటకు
తేనెలైనా, సోనలైనా !

బ్రతుకుపోతులు
వెతకినప్పుడె
దృక్పథాలకు
దీప్తులైనా, వ్యాప్తులైనా !

కలలతీవుల
కరగినప్పుడె
బరువురాత్రికి
గరువమైనా, పరువమైనా!

పరుల సేవల
పండినప్పుడె
జీవితానికి
చేవలైనా, తావులైనా!

పల్లెపల్లెను
చెల్లినప్పుడె
నాదు పాటకు
మోదమైనా, మూల్యమైనా!

# ప్రకృతి

రంగురంగు అంబరం,
చెంగుచెంగు శంబరం:
పూయదా దృగంతరం!
పొంగదా హృదంతరం!!

# స్వగతం

లేదు నాకు శాంతి, సుఖము లేదు; నిత్య
ఘోషల గలుగు పాథోధి, క్రూరతరణి
తప్తసైకతస్థలి ; వివిక్తజనవాటి
శిథిలగృహము - నాహృది !
లేదు చింత సిరుల
నోలలాడ ; కోరను భోగజాలమేమి ;
ప్రేమదారిద్ర్య మెరుగను ; ధామ మొప్పు
పుత్రపుత్రీప్రియాలాపపూర్ణదివ్య
సీమగాగ ; పరులదృష్టి జీవితమ్ము
బహుజయప్రదమ్ము ; దహించు పాపకీల
శిఖలు గుప్తమై లేవు హృత్సీమ—
అయిన
గ్రాలులోన సంకుల మహాభీలమైన
వెలితి ; బ్రతుకునే అది చాల వెక్కిరించు
వికటముగ నవ్వి—
చూపట్టు నికటముననె
జీవిత విశిష్ట లక్ష్యము ; చేరబోవ

దూరమౌను ; వినువుకెంద వేరు లక్ష్య
మేదియో చీరు ; వెన్నాడ నెంతొ త్రిప్పి
మాయలేడియౌను—
తరచు మదిని మోసు

తెత్తు కాంతులీనుచు చిత్రలీలగా న
నంత భావపుంజము ; పుట్టిసంత గిట్టు
గాని, వేయదు మారాకునైన—
ఎవొ సు

ధామధుర మోహనంపు నాదములు తొంద
రించు నెద ; గొంతుకను సవరింప నొక్క
తేనెపాటైన పెగలదు—
తెంపులేని

తపన ; ఫలితమ్ము పూజ్యము ; దారుణమ్ము
నిదుర కౌగిలిలోనైన కదలి, కనలి,
కుమిలి పీడించు నొక బాధ—
గొప్ప కృషియె

తప్ప సాధించినది ఇంతదనుక కొంచె
మైన లేదు ; పోయె వయసు ; మరలి రాదు ;
పిలుపు రాకమునుపె నాదు కలలపంట
పండునో, లేదొ........

# మధురకీలలు

అల్లి నింగిని
తెల్ల మబ్బుల
పకపకలు
వికవికలు

కావి మెంతను
రావి యాకుల
మిలమిలలు
తళతళలు

పిల్ల తెమ్మెర
మల్లె మొగ్గల
గుసగుసలు
మిసమిసలు

గడుసు కెరటము,
గండు కోయిల
గబగబలు
గుబగుబలు

బడుల గంటలు,
గుడుల గంటల
గణగణలు
ఘణఘణలు

పిచ్చిపిట్టల,
పిచ్చుకపుత్రల
పిలపిలలు
కిలకిలలు

పాలబుగ్గల
పాప నవ్వుల
నిగనిగలు
ధగధగలు

హృదయసీమల
మధురకేలల
ఢగఢగలు
ఘుగఘుగలు

# కాకసప్తకం

అనగనగ ఒక కాకి,
ఆరింద ఆ కాకి

తెలతెల్ల వారకనె
తేటగా లేచింది ;

"కాక, కాకా" యనుచు
లోకాన్ని లేపింది ;

ఇల్లిల్లు చుట్టింది,
ఎంగిళ్ళు మెక్కింది ;

గుట్టుమట్టుగ తిరిగి
గూటిలో చేరింది !

అనగనగ ఒక కాకి
ఆరింద ఆ కాకి

*

కలదండి ఒక కాకి,
గజదొంగ ఆ కాకి

పిల్లలకు దాపులో
చల్లగా చేరింది ;
ఒక గంతు వేసింది,
ఒక్కింత జరిగింది ;
మలిగంతు వేసింది,
మరికొంత జరిగింది ;
తాయమ్మ తన్నింది,
తా నెగిరిపోయింది :

కలదండి ఒక కాకి,
గజదొంగ ఆ కాకి

*

వచ్చింది ఒక కాకి,
వయ్యారి ఆ కాకి

తక్కుతూ తారుతూ
దిక్కులను చూచింది ;
ముక్కు దువ్వేనకాగ
ముస్తాబు చేసింది ;
మెడ సుంత వంచింది,
మెల్లగా కూసింది ;

ఎందుకో రేచింది,
ఎగిరెగిరి పోయింది !

వచ్చింది ఒక కాకి,
వయ్యారి ఆ కాకి

*

వాలింది ఒక కాకి,
పగలాడి ఆ కాకి

ముత్తయిదు పటు ముందు
ముద్దుగా కూర్చుంది ;
పలుకరిస్తున్నట్లు
పలుమార్లు కూసింది ;
చనువుగా వంటింటి
ఛాయలకు చేరింది ;
చేతితో విదిలింప
వెంటనే పోయింది !

వాలింది ఒక కాకి,
పగలాడి ఆ కాకి

*

చేరింది ఒక కాకి,
చెల్లాయి ఆ కాకి

చిరుగజ్జెరాళ్లతో
చిందులను తొక్కింది ;

మెరసిపోయే కళ్ల
మురిపెమ్ము చూపింది :

కన్నవారింటిలో
కలరూపు తెల్పింది :

అన్నవచ్చే వార్త
అందించి పోయింది !

చేరింది ఒక కాకి,
వెళ్లాయి ఆ కాకి

*

అయ్యయ్యో ఒక కాకి,
గయ్యాళి ఆ కాకి

కారణములేకనే
వైరమ్ము పూనింది ;

కారాలు, మిరియాలు
కలగలిపి నూరింది ;

కవ్వించి కవ్వించి
కయ్యమ్ములాడింది ;

తరుముకుంటూ వచ్చి
తల దన్నిపోయింది!
అయ్యయ్యో ఒక కాకి,
గయ్యాళి ఆ కాకి

*

రచ్చలో ఒక కాకి,
రాకాసి ఆ కాకి
ఆరబోసిన పిండి
తేరగా బొక్కింది;
నెత్తిబుట్టలవారి
నిలువునా దోచింది;
ఇనుపముక్కును పెట్టి
ఎద్దులను పొడిచింది;
కొట్టి కారాడంగ
తిట్టుతూ పోయింది!
రచ్చలో ఒక కాకి,
రాకాసి ఆ కాకి

# ద్వంద్వాతీతం

వెలుగువెనుకనె యిరులు
ఇరులవెనుకనె వెలుగు——
అటు చూడు !
ఉదయసంధ్యాశోభ !

ఎండలోనే వాన,
వానలోనే యెండ——
ఇటు తిరుగు !
ఇంద్రచాపం సొబగు !

బ్రతుకువెన్నంటి మృతి,
మృతినీడనే బ్రతుకు——
వినవోయి !
పురిటింటి కేరింత !

# సాగరరాజు

రాజా ! ఓహో ! సాగరరాజా ! !

హోరను ఘోషల
తీరని బాధలు
ఇంతగ నుండెను
నెందుల కోయీ ?

రాజా ! ఓహో ! సాగరరాజా ! !

ఘోషలు జాగృతి,
ఘోషిత నిద్రను :
ఘోరము లేవో
భారము లౌనా ?

రాజా ! ఓహో ! సాగరరాజా ! !

జంటను కానని
ఒంటరి బ్రతుకున
మంటలు రేపగ
రంటరపడుదువె ?

రాజా ! ఓహో ! సాగరరాజా ! !

వచ్చుచు, పోవుచు
వెచ్చని నెత్తురు
చిందే సూర్యుడు
చీదరపరచునె ?

రాజా ! ఓహో ! సాగరరాజా ! !

ఆడుచు తరగల
హాస్యముచేసే
తుంటరి చంద్రుడు
తొట్రిలజేయునె ?

రాజా ! ఓహో ! సారగరాజా ! !

మెడలో మాలగ
మెరసే చుక్కలు
చేతికి చిక్కక
చిక్కులు పెట్టునె ?

రాజా ! ఓహో ! సాగరరాజా ! !

చెరిగిన లక్ష్యమొ,
కరగిన కలలో

కంతలు వెట్టునె
కలకాలంబును ?
రాజా ! ఓహో ! సాగరరాజా ! !

చేరగ తీరము
చింపరతా సి
భంగము లన్నియు
భగ్నపు టాశలె ?
రాజా ! ఓహో ! సాగరరాజా ! !

నదీనదమ్ములు
నానాసీమల
దురితము చెప్పగ
దుఃఖము వచ్చునె ?
రాజా ! ఓహో ! సాగరరాజా ! !

దివిలో మేఘుడు
భువిపై దైన్యము
కవిపై తెల్పగ
కలగునె గుండెలు ?
రాజా ! ఓహో ! సాగరరాజా ! !

అనేక యుగాల
అనాథకోటుల
అశ్రువులా నీ
అపార జలములు ?
రాజా ! ఓహో ! సాగరరాజా ! !

మ్రింగదు శోకము.
పొంగును కోపము ;
కోపము పొంగిన
క్రుంగదె లోకము ?
రాజా ! ఓహో ! సాగరరాజా ! !

# మూకభాష

లజ్జతో లోలాక్షి పజ్జకే రాక,
మునిపంట వ్రేలితో మోము వంచంగ,
చలి జేరదొమ్మని తెలియజెప్పంగ
విరిసింది పెదవుల దరహాసరేఖ !

సంతాన పద్మాక్షి చెంతకే రాక,
పెదవులు కంపింప పెడమోము పెట్ట,
చెలియల్క క్షణమని తెలియజెప్పంగ
మెరసింది కబరిలో విరజాజిదండ !

కలహించి కామాక్షి కన్నీరు నింప,
అతిపవిత్రమె చేరి ప్రతియశ్రుకణము
"ఏమైన గానిమ్ము - ఎగ్గు నీ" దనుచు
సణిగింది జరజర జారి చెక్కిటను ;

కన్నవారింటికి కమలాక్షి కదల,
రివ్వుగాలికి పైట రెపరెపలాడి
"అడుగె ముందుకుగాని, ఆత్మ రా" దనుచు
పలికింది మరిమరి బాస చేయుచును !!

# వర్షం

వర్షం వర్షం
చిటచిట, తటతట,
ఛొటఛొట, ఇటనట
వర్షం వర్షం

వర్షం వర్షం
గలగల, జలజల,
పలపల, ఇలనిల
వర్షం వర్షం

వర్షం వర్షం
వడవడ, బడబడ,
గడగడ, ఎడనెడ
వర్షం వర్షం

వర్షం వర్షం
తళతళ మెరపుల,
ఫెళఫెళ పిడుగుల
వర్షం వర్షం

వర్షం వర్షం
గబగబ గాలుల,
దబదబ కుండల
వర్షం వర్షం

వర్షం వర్షం
గిలిగించు మెఱుగుల,
ఝడిపించు పిడుగుల
వర్షం వర్షం

వర్షం వర్షం
తరులందు పులకల,
గరికల మొలకల
వర్షం వర్షం

వర్షం వర్షం
చిందుల వాగులు,
సందడి వాగులు
వర్షం వర్షం

వర్షం వర్షం
పొంగుల యేరులు,

బంగరు తేరులు
వర్షం వర్షం

వర్షం వర్షం
త్రుళ్ళిన చెరువులు.
త్రెళ్ళిన కరవులు
వర్షం వర్షం

వర్షం వర్షం
పొర్లిన దొరువులు,
పర్లిన బరువులు
వర్షం, వర్షం

వర్షం వర్షం
కర్షకలోకం
కలలకు కర్షం
వర్షం వర్షం

వర్షం వర్షం
తీరిన తర్షం,
మీరిన హర్షం
వర్షం వర్షం

# భారం

భారమురా ! భారమురా ! ప్రేమా
ధారములేని బ్రతుకు భారమురా !

అనురాగము కానరాని గృహమే
శనిదేవత శయ్యాగారమురా !

భారమురా ! భారమురా ! ప్రేమా
ధారములేని బ్రతుకు భారమురా !

సమభావము శూన్యమైన నరులే
యమదూతల స్కంధావారమురా !

భారమురా ! భారమురా ! ప్రేమా
ధారములేని బ్రతుకు భారమురా !

బహిరంతరసంఘర్షణ శకమే
గహనాంతర కారాగారమురా !

భారమురా ! భారమురా ! ప్రేమా
ధారములేని బ్రతుకు భారమురా !

విషసుందరనటనామయ జగమే
అసురాత్మక పారావారమురా !

ఘోరమురా ! ఘోరమురా ! ప్రేమా
ధారములేని బ్రతుకు ఘోరమురా !

మానవతే మటుమాయంబైతే
మనుగడయే బాధాపూరమురా !

ఘోరమురా ! ఘోరమురా ! ప్రేమా
ధారములేని బ్రతుకు ఘోరమురా !

## మూడు పువ్వులు :

## ఆరు కాయలు

తీగలు సాగిన
తీరులు ఇంతే, ఇందే—
ప్రేమలు ప్రాకిన
వెల్లులు నిండుగ మహికే, మదికే!

పూవులు పూచిన
తావులు కొంతే, సుంతే—
గుండెలు విరిసిన
పండుగ సంతత మిలకే, కలకే!

కాయలు ముగ్గిన
గరిమము క్షణమే, తృణమే—
బ్రతుకులు పండిన
పరువము స్థిరముగ భువికే, దివికే

# ఆశా సందేశం

పిచ్చుకా ! పిచ్చుకా !
ఓ పిచ్చుకమ్మ ! !

ఒంటిగా నుంటివా
ఓ పిచ్చుకమ్మ ?

జంట యేమాయెనే
ఓ పిచ్చుకమ్మ ?

ఏ వూరు, ఏ సీమ
ఓ పిచ్చుకమ్మ !

ఏగెనే నీ జోడు
ఓ పిచ్చుకమ్మ ?

ఏలనే యెడబాటు
ఓ పిచ్చుకమ్మ ?

ఎందుకే తడబాటు
ఓ పిచ్చుకమ్మ ?

నవ్వించి, నమ్మించి
ఓ పిచ్చుకమ్మ ?

నాథుండు వెళ్లెనా
ఓ పిచ్చుకమ్మ ?

లాలించి, సోలించి
ఓ పిచ్చుకమ్మ

పాలుండు వెన్నైనా
ఓ పిచ్చుకమ్మ ?

కవ్వించి, కలహించి
ఓ పిచ్చుకమ్మ

కాంతుండు వెన్నైనా
ఓ పిచ్చుకమ్మ ?

కాటుకలు కరగంగ
ఓ పిచ్చుకమ్మ

కన్నీటి కాల్వలు
ఓ పిచ్చుకమ్మ

ఏలనే బేలగా
ఓ పిచ్చుకమ్మ ?

చాలు నీ నిట్టూర్పు
రో పిచ్చుకమ్మ !

వెన్న మనసులవాడు
ఓ పిచ్చుకమ్మ

ఎన్నాళ్లు రాకుండు
నో పిచ్చుకమ్మ ?

మొలక నవ్వులవాడు
ఓ పిచ్చికమ్మ

అయిన కలకాలమూ
ఓ పిచ్చికమ్మ ?

వస్తాడు వగకాడు
ఓ పిచ్చికమ్మ

వచ్చి, వలపిస్తాడు
ఓ పిచ్చికమ్మ !

తెస్తాడు తేనెలను
ఓ పిచ్చికమ్మ !

తెచ్చి, తేలిస్తాడు
ఓ పిచ్చికమ్మ !

ఇస్తాడు ముద్దులను
ఓ పిచ్చికమ్మ ?

ఇచ్చి, లాలిస్తాడు
ఓ పిచ్చికమ్మ !

పువ్వులను ముడతాడు
ఓ పిచ్చికమ్మ !

పువ్వులకు రాణివే
ఓ పిచ్చికమ్మ !

మేడలను కడతాడు
ఓ పిచ్చికమ్మ !
మేడలకు వెలుగువే
ఓ పిచ్చికమ్మ !
కవనాలు చెబుతాడు
ఓ పిచ్చికమ్మ !
కవనాల నిగ్గువే
ఓ పిచ్చికమ్మ !
మత్తుమందులు చల్లి
ఓ పిచ్చికమ్మ
మచ్చికలు చేయునే
ఓ పిచ్చికమ్మ !
అరచేతిలో స్వర్గ
మో పిచ్చికమ్మ
అంతలోనే చూపు
నో పిచ్చికమ్మ !
మగవారి మాయ లివి
ఓ పిచ్చికమ్మ
మగువ ! నీ వెఱుగవే
ఓ పిచ్చికమ్మ ?

ఆలితో కలహమ్ము
లో పిచ్చుకమ్మ

అరనిముసమే కాదె
ఓ పిచ్చుకమ్మ ?

చందమామను మబ్బు
తో పిచ్చుకమ్మ

ఎండాక దాచునే
ఓ పిచ్చుకమ్మ ?

బాలసూర్యుని మంచు
ఓ పిచ్చుకమ్మ

బంధించి విడువదా
ఓ పిచ్చుకమ్మ !

కన్నీరు పోనాడి
ఓ పిచ్చుకమ్మ

పన్నీట మునుగవే
ఓ పిచ్చుకమ్మ !

వలవంత విడనాడి
ఓ పిచ్చుకమ్మ

వలువ సింగారించు
మో పిచ్చుకమ్మ !

కురులు చక్కాగ దువ్వి
ఓ పిచ్చుకమ్మ
విరులు వెలయించవే
ఓ పిచ్చుకమ్మ !

కళ్ల కాటుక దిద్ది
ఓ పిచ్చుకమ్మ
కస్తూరి తీర్చవే
ఓ పిచ్చుకమ్మ !

కర్పూరమాలతో
ఓ పిచ్చుకమ్మ
కలకన్నె కావమ్మ
ఓ పిచ్చుకమ్మ !

కిలకిలా నవ్వుతూ
ఓ పిచ్చుకమ్మ
తలు పింక చాయవే
ఓ పిచ్చుకమ్మ !

ఓరగా నిలుచుండి
ఓ పిచ్చుకమ్మ
కోరికలు కొమరొందు
ఓ పిచ్చుకమ్మ

ఎదురుతెన్నులు చూడు
మో పిచ్చుకమ్మ !

ఎటులు చూచుటలోన
ఓ పిచ్చుకమ్మ

ఎంతైన మోదమ్ము
ఓ పిచ్చుకమ్మ !

ఆస లేకుంటేను
ఓ పిచ్చుకమ్మ

కాసు కాదే బ్రతుకు
ఓ పిచ్చుకమ్మ !

ఆశతోనే కాదె
ఓ పిచ్చుకమ్మ

అమృతమథనము నాడు
ఓ పిచ్చుకమ్మ ?

ఆశతోనే కాదె
ఓ పిచ్చుకమ్మ

అక్షమ్ముపై విశ్వ
మో పిచ్చుకమ్మ

అక్షయమ్ముగ దిరుగు
నో పిచ్చుకమ్మ ?

మింటిచుక్కలలోన
ఓ పిచ్చుకమ్మ
మినుకుమినుకను ఆశ
ఓ పిచ్చుకమ్మ !

తరగనురుగులలోన
ఓ పిచ్చుకమ్మ
తళుకాడునే ఆశ
ఓ పిచ్చుకమ్మ !

శిశిరమ్ములోనైన
ఓ పిచ్చుకమ్మ
శిథిలమ్ము కా దాశ
ఓ పిచ్చుకమ్మ !

త్రాచుపడగల నీడ
నో పిచ్చుకమ్మ
తారసిల్లును ఆశ
ఓ పిచ్చుకమ్మ !

అగ్నిపర్వతశిఖల
నో పిచ్చుకమ్మ
ఆశ లాస్యము చేయు
నో పిచ్చుకమ్మ !

నైరాశ్యమందైన
ఓ పిచ్చికమ్మ

తారాడునే ఆశ
ఓ పిచ్చికమ్మ !

ఆశయే లోకమ్ము
ఓ పిచ్చికమ్మ !

ఆశయే నాకమ్ము
ఓ పిచ్చికమ్మ !

ఆశతో వర్ధిల్లు
మో పిచ్చికమ్మ

ఆశిస్సు నీకమ్మ
ఓ పిచ్చికమ్మ !

# కోకిలమా!

"క్రోక్రో-క్రోక్రో" క్రోకిలమా!!

చిగురుల చాటున చెలగుచు, మెలగుచు
చిక్కగ పాడే కోకిలమా!
తోపుల సందున దోగుచు, దాగుచు
ఏపుగ పాడే కోకిలమా!

"క్రోక్రో-క్రోక్రో" కోకిలమా!!

మాటల కందని తేటల తేనెలు
ఊటలు కట్టే కోకిలమా!
పాటల కందని బాటల కవితను
ధాటిగ నడిపే కోకిలమా!

"క్రోక్రో-క్రోక్రో" క్రోకిలమా!!

చూపుల కందని సురలోకాలకు
రూపులు దిద్దే కోకిలమా!
ఊహల కందని మోహనమూర్తికి
ఊపిరి పోసే కోకిలమా!

"క్రోక్రో-క్రోక్రో" క్రోకిలమా!!

మూలము తెలియని కాలావధులకు
గాలము వేసే కోకిలమా !
మృత్యువు నెరుగని సత్యము నేదో
మేదిని కిచ్చే కోకిలమా !

"కోకో-కోకో" కోకిలమా ! !

# కవితా సామ్రాజ్యం

ఎవ రోహో! ఎవ రోహో! నా
కెదురు నిలుచువా రెవ రోహో!!

మాటల దివిటీలే
పోటరి యీ తెలుగా
దీటులేని నా పో
రాటము చీకటిపై!

ఎవ రోహో! ఎవ రోహో! నా
కెదురు నిలుచువా రెవ రోహో!!

ఊహాలు నా బంటులు.
ఉపమలె సామంతులు;
కవితాసమ్రాట్టును,
కప్పము రాసిక్యము!

ఎవ రోహో! ఎవ రోహో! నా
కెదురు నిలుచువా రెవ రోహో!!

వ్యోమమె నా ఛత్రము.
భువిమే సింహాపీఠి;
నా యుగధర్మమ్మే
నాదౌ రాజముద్ర!

ఎవ రోహో ! ఎవ రోహో ! నా
కెదురు నిలుచువా రెవ రోహో ! !

ధ్వని నా పట్టమహిషి.
ధామమౌ దిగంతము :
విభాతప్రభలు నా
ప్రేమల రోచిస్సులు !

ఎవ రోహో ! ఎవ రోహో ! నా
కెదురు నిలుచువా రెవ రోహో ! !

కలలసే నాఘంటసు;
విలువల నిర్ణేతను !
విశ్వమె నా వాటిక;
విహరించగ వెడలితి !

ఎవ రోహో ! ఎవ రోహో ! నా
కెదురు నిలుచువా రెవ రోహో ! !

అందమ్ములు పంచుట,
ఆనందము నింపుట
నా రాజధర్మమై
రారాజుగ చెల్లెద !

ఎవ రోహో ! ఎవ రోహో ! నా
కెదురు నిలుచువా రెవ రోహో ! !

# న రు ని బ్ర తు కు

తిరిగి వచ్చు వాసరం,
తిరిగి తెచ్చు వేసరం :
తిరిగి తిరిగి సంగరం,
నరునిబ్రతుకు బొంగరం !

పోయె నొక్క వత్సరం,
పోని దొక్క మత్సరం :
నురుగుక్రక్కు నిర్ఝరం,
నరునిబ్రతుకు జర్జరం !

ఒకనికంట కాతరం,
ఒకనియొంట పోతరం :
అరుదు సుమ్మ నిబ్బరం,
నరునిబ్రతుకు బర్బరం !

# న ల్ల మ బ్బు లు

చెన్నుదరిగిన మిన్నులో నవి
తెన్నుగానక చిన్నవోయిన
వన్నెయేనుగు గున్నలా ?

ఆటపట్టుల మేటిదాహము
నాటమై, కడుచేటు తేగా
నీటికోసము ఏటికై ——

గురుతు నెరుగని తెరువులో బడి
సరగుసరగున అరయగా నవి
బరువుగా నవి పరుగులా ?

చెన్నుదరిగిన మిన్నులో నవి
తెన్నుగానక చిన్నవోయిన
వన్నెయేనుగు గున్నలా ?

పా ఠాం త రం

ప్రభావిహీన
సభములో నవి
ఇభములా ?

దాహజాముగ్రగ
దాహాన్నై, జల
ధారకై ——
స్వచ్ఛశీతల
స్పర్శదీపిత
వాహిని
తటము చేరగ
దారికై అది
దైన్యమా ?
ప్రభావిహీన
పణములో నవి
క్షణములా ?

# పదలౌల్యం

గుయ్యారం !
అయ్యో ! చీకటి బుయ్యారం ! !
బుయ్యారం పెంచీకటి
ఉయ్యాలల సయ్యాటలలో—
అయ్యారే !
నెయ్యాలను, తియ్యాలను
వియ్యాలను, కయ్యాలను
గయ్యాళి గత్తరను
చెయ్యాడుచు దయ్యారయ్యో
దయ్యాల పెంజడల వయ్యారం !
గుయ్యారం ! చీకటి బుయ్యారం ! !
నయ్యో, గొయ్యో తెలియని
బుయ్యారంతో
కుయ్యో ! మొఱ్ఱో !
దయ్యాల పెంజడల వయ్యారం ! !

# నవ్వులు

నవ్వులె సృష్టికి నాందీవచనము !
నిజ మిది సకియా ! నిజ మిది సఖుడా !!

అణువులు కూడగ,
ఆకృతు లేర్పడ

దెసదెస నవ్వులు,
ముసిముసి నవ్వులు

ప్రణవము పుట్టగ,
ప్రాణులు కదలగ

ఇలనిల నవ్వులు,
కిలకిల నవ్వులు

నవ్వులె సృష్టికి నాందీవచనము !
నిజ మిది సకియా ! నిజ మిది సఖుడా !!

ఆమని విచ్చగ,
ఆశలు రెచ్చగ

పకపక నవ్వులు,
ప్రగతుల నవ్వులు

ప్రేమలు నిండగ,
సీమలు పండగ

కలకల నవ్వులు,
కవితల నవ్వులు

నవ్వులె సృష్టికి నాందీవచనము!
నిజ మిది సకియా! నిజ మిది సఖుడా!!

II

నవ్వులె సకియా! నభముల వెలుగులు!
నవ్వులె సఖుడా! నందనవనములు!!

పొడిచే పొద్దుల
పుత్తడి నవ్వులు:

ఇల కెల్లను మే
ల్కొలుపుల నవ్వులు

వెన్నెలరేనికి
పున్నమి నవ్వులు:

కలలను కదిపే
కమ్మని నవ్వులు

నవ్వులె సకియా! నభముల వెలుగులు!
నవ్వులె సఖుడా! నందనవనములు!!

మబ్బుల అంచుల
సిబ్బితి నవ్వులు :

దాగుడుమూతల
మీగడ నవ్వులు

రేయికి జడలో
రిక్కల నవ్వులు :

గుసగుసలాడే
గుత్తుల నవ్వులు

నవ్వులె సకియా ! నభముల వెలుగులు !
నవ్వులె సఖుడా ! నందనవనములు ! !

ఇంద్రధనుస్సున
ఇంపుల నవ్వులు :

వంపులు తిరిగే
సొంపుల నవ్వులు

తరగల నురుగుల
తళతళ నవ్వులు :

ఊయల లూగే
ఛాయల నవ్వులు

నవ్వులె సకియా ! నభముల వెలుగులు !
నవ్వులె సఖుడా ! నందనవనములు ! !

మల్లియపొదలో
కొల్లలు నవ్వులు :

చక్కిలిగింతల
చిక్కని నవ్వులు

పల్లకిపాటకు
పల్లవి నవ్వులు :

దిక్కులు నిండే
చక్కెర నవ్వులు

నవ్వులె సకియా ! నభముల వెలుగులు ! !
నవ్వులె సఖుడా ! నందనవనములు ! !

## III

నవ్వులతోటల పువ్వులు కోయగ
రావే సకియా ! రారా సఖుడా ! !

పిల్లల కళ్ళను
చల్లని నవ్వులు :

చల్లని వెన్నెల
జల్లుల నవ్వులు

తండ్రుల గుండెల
తరుగని నవ్వులు :

చెరుగని ప్రేమల
తనిపే నవ్వులు

పిల్లల పెదవుల
వెల్లువ నవ్వులు :

వెల్లువ డోలల
వెల్గుల నవ్వులు

నవ్వులతోటల పువ్వులు కోయగ
రావే సకియా ! రారా సఖుడా ! !

జవ్వని సిగ్గుల
మువ్వల నవ్వులు :

మువ్వల మ్రోతల
రవ్వల నవ్వులు !

యువకుని నడకల
నవకపు నవ్వులు :

నవకపు శక్తుల
నాట్యపు నవ్వులు

తరుణీతరుణుల
తలపుల నవ్వులు :

తలపుల మధువులు
చిలికే నవ్వులు

నవ్వులతోటల పువ్వులు కోయగ
రావే సకియా ! రారా సఖుడా ! !

## IV

నవ్వులతోటల నాగులు తిరుగును !
భద్రము సకియా ! భద్రము సఖుడా ! !

అల్లరి పెట్టే
అవ్వల నవ్వులు :

తప్పులు వెదకే
తాతల నవ్వులు

ఆరడి పెట్టే
అత్తల నవ్వులు ;

పెదవిని విరిచే
వదినెల నవ్వులు

నవ్వులతోటల నాగులు తిరుగును !
భద్రము సకియా ! భద్రము సఖుడా ! !

చెక్కిట వేలిడు
టెక్కుల నవ్వులు ;

నిక్కము దాచే
టక్కరి నవ్వులు

చేతుల చాటున
చిలిపిగ నవ్వులు ;

వేరొక నెపమున
విసముల నవ్వులు

నవ్వులతోటల నాగులు తిరుగును !
భద్రము సఖియా ! భద్రము సఖుడా ! !

రోకుప చేసే
కాటుల నవ్వులు ;

పేరులు పెట్టే
పీన్గుల నవ్వులు

ఎక్కులు చెప్పే
టెక్కుల నవ్వులు ;

మిక్కిలి వినయం
నక్కల నవ్వులు

నవ్వులతోటల నాగులు తిరుగును !
భద్రము సఖియా ! భద్రము సఖుడా ! !

అక్కరకోసం
కొక్కెర నవ్వులు ;

అక్కసు పెంచిన
రక్కసి నవ్వులు

"హూహూ - హోహో"
హూమాయి నవ్వులు ;

"హీహీ - హేహే"
హిడింబి నవ్వులు

నవ్వుంతోటల నాగులు తిరుగును !
భద్రము సకియా ! భద్రము సఖుడా ! !

V

స్వచ్ఛపు నవ్వులె స్వర్గము సకియా !
స్వర్ణయుగమ్ముల శంఖము సఖుడా ! !

కల్లల నెరుగని
చల్లని నవ్వున
కరగదె రోషము !
విరుగదె ద్వేషము ?

తేనెలు చిందే
సోనల నవ్వున
చెరుగవె చింతలు ?
పెరుగవె ప్రేమలు ?

స్వచ్ఛపు నవ్వులె స్వర్గము సకియా !
స్వర్ణయుగమ్ముల శంఖము సఖుడా ! !

కన్నుల నవ్వుకు
క్రమ్మిన నీళ్లను
నాట్యము చేయును
నాకము సకియా !

క్రూరపు విధికిని
కోరలు తీసే
మెలకువ నవ్వే
తెలియును సఖుడా !

స్వచ్ఛపు నవ్వులె స్వర్గము సకియా !
స్వర్ణయుగమ్ముల శంఖము సఖుడా !!

విబుధుడు గ్రీసున
విషమును గ్రోలుచు
పరపిన నవ్వులు
తరుగవు సకియా !

సిలువను చిందిన
విలువల నవ్వులు
మాయక నిలుచును
మహిలో సఖుడా !

స్వచ్ఛపు నవ్వులె స్వర్గము సకియా !
స్వర్ణయుగమ్ముల శంఖము సఖుడా !!

శాంతిని కురిసిన
శాక్యుని నవ్వులు
నిఖిలజగమ్ములు
నింపును సకియా !

నవ్వుల తాతయె
నాయకుడై మన
దేశపు దాస్యము
తీర్చెను సఖుడా !

స్వేచ్ఛపు నవ్వులె స్వర్గము సకియా !
స్వర్ణయుగమ్ముల శంఖము సఖుడా ! !

# ఒకనాడు...

ఒకనాడు, ఒకనాడు
ఒకనాటి ఉదయాన
ఒక రైతు పొల మేగి
ఒక జాము చెమ టోడ్చి
"మెరక మొండు కలదమ్మ
సకలమ్ము కబళింప
ఒక పంట కనిపెట్టు
మిక" నంచు ప్రణమిల్ల,
తలయూచి పరిచేను
"వల దోయి భయ మింక,
పయిరాతు"నని పల్కె
పశుపాల కనుదోయి !

*

ఒకనాడు, ఒకనాడు
ఒకనాటి నడిరేయి
ఒక పెద్ద ఋణదాత
"ఒక రోజె కలదోయి

చనభాప గమ వింత——

శనిగాని తొలగించి,

గనిగష్ట హరియింతు"

సని కీడు మదినెంచి.

ఇకలించి ఒక ఘూాక

"మిరసేల తడ" పంచు

కనుమూయు చిలుపుల్గు

గబళించె చయమూరి ! !

# మబ్బు కన్నె

ఏమి లోపం మబ్బుకన్నెకు ?
ఏం శోకం మేఘబాలకు ?

కన్నుమయుగై మిన్ను తెరపై
కరిగిపోయెన, కరిగిపోయెన,
పుపసగుమతే చిటిలిపోవగ
కటిక నేలకు రాలిపోయెన

ఏమి లోపం మబ్బుకన్నెకు ?
ఏల శోకం మేఘబాలకు ?

సంజతల్లులు సరిగవీరల
సారెకావడి పంపలేదా ?
ముద్దుచేతుల మందపవనుడు
ముంగురులు సరిదిద్దలేదా ?

ఏమి లోపం మబ్బుకన్నెకు ?
ఏం శోకం మేఘబాలకు ?

మెచ్చి మెరపులు. వచ్చి వేణికి
పచ్చసవరం కూర్చలేదా ?
తీర్చలేదా బాలచంద్రుడు
తీరుగా సితగంధతిలకము ?

ఏమి లోపం మబ్బుకన్నెకు ?
ఏల శోకం మేఘబాలకు ?

కొల్లకొల్లలు మింటిచుక్కలు
మల్లెలై జత విరియలేదా ?
కన్నుచెదరే పూలపాలికె
మిన్నురాణే యెత్తలేదా ?

ఏమి లోపం మబ్బుకన్నెకు ?
ఏల శోకం మేఘబాలకు ?

పిడుగుపించులు దిక్కు లదరగ
పెద్ద భేరీ వెయ్యలేదా ?
నెమలిగుంపులు విమలఘణుతుల
నృత్యకేళిని నెరపలేదా ?

ఏమి లోపం మబ్బుకన్నెకు ?
ఏల శోకం మేఘబాలకు ?

కరగిపోయిన, నురిగిపోయిన,
కటికనేలకు రాలిపోయిన
కడలినాథుని చేరబోదా ?
కన్నెచెరలను వీడబోదా ?

ఏమి లోపం మబ్బుకన్నెకు ?
ఏల శోకం మేఘబాలకు ?

# కవితా!

సుందరాంగివని, ఇందురేఖవని
ఎందరు వలచిరో, ఎందరు కొలిచిరో
అందరాని ఓ కవితా!

అందరాని ఆనందరాశివై
ఎందరి వినతులు, ఎందరి ప్రణతులు
అందుకొంటివో కవితా!

యుగయుగాలకే ఉషోదేవివై
నగాగ్రములపై నర్తనచేయుచు
ధగధగలాడిన కవితా!

భాషభాష కొక వేషభూషతో,
భాషహద్దులను రోసిన జిగితో
భాసించిన ఓ కవితా!

జాతిజాతి కొక రీతిరీతితో,
జాతీయమ్ముత్రల స్వాతివానతో
ఖ్యాతిగన్న ఓ కవితా!

వేళవేళ కొాక మేళక_ర్తవై,
వ్యాళకన్యలే మేలుమే లనగ
హేలచూపు ఓ కవితా!

కావ్యకావ్యమున నవ్యరూపవై,
దివ్యసత్యముల ధృతిని చాటగల
భవ్యచరిత ఓ కవితా!

పలుకుపలుకులో కులుకు లొొప్పగా
ఇలాతలముపై కళామధువులను
చిలుకరించు ఓ కవితా!

వంద యజ్ఞముల ప్రణవనాదమున,
వంద జన్మముల బృందగానమున
తొొందరించు ఓ కవితా!

వేయి స్వప్నముల వేలాశాలల,
వేయి లక్ష్యముల వీణాతంత్రుల
హాయిగొొలుపు ఓ కవితా!

లక్ష భావనల నిక్షేపముగా
లక్ష యామినుల నక్షయమ్ముగా
భిక్షపెట్టు ఓ కవితా!

కోటి కామనల తోటమాలిగా,
కోటి ఆమనుల మేటిపంటగా
సాటిలేని ఓ కవితా !

ప్రమోదకలితా ! ప్రసాదభరితా !
సమానరహితా ! స్వధర్మసహితా !
నమామి ! ఓహో ! కవితా ! !

*

కలలలో రేయి కరగుచుండగా,
శిలలలో శిల్పము వెలయుచుండగా
మొలకలెత్తు ఓ కవితా !

ఇలను చీకటులు తొలగుచుండగా,
పిలుపులై బ్రతుకు పిలుచుచుండగా
కొలుపుదీర్చు ఓ కవితా !

పుడమి లేజిగురు తొడుగుచుండగా,
ఎదదలో పలుద పొడుచుచుండగా
వెదలబారు ఓ కవితా !

ఇనుడు సంభ్రమమున మునుగు తావులో,
కనులు వెలుగుకై కనలు తావులో
జననమందు ఓ కవితా !

గంగాయమునలు కలియు తావులో,
నింగి నేలలు పెనంగు తావులో
తొంగలించు ఓ కవితా !

పొంగుకడలి నుప్పొంగు తరగపై
రంగవల్లులై పొంగు నురుగులో
తొంగిచూచు ఓ కవితా !

చిందువెన్నెల మరందపుంజముం
నందనమ్ములో అందచందముల
విందుచేయు ఓ కవితా !

రాలుచుక్కలో, ప్రేలుపెల్గులో,
సోలురేయిలో లీలలీలగా
జాలువారు ఓ కవితా !

వానమబ్బులో, చేనుదుబ్బులో,
ఈను పైరులో సోనసోనలై
తేనెలూరు ఓ కవితా !

కొండకోనలో, నిండు కొలకులో,
ఎండమంపులో, ఏటివంపులో
పండియుండు ఓ కవితా!

జల్లువానలో, వానవిల్లులో,
నల్లకలువలో, కలువకళ్ళలో
వెల్లివిరియు ఓ కవితా!

మించుతళుకులో, తళుకుమంచులో,
అంచకులుకులో, పలుకుకుంచెలో
పొంచిచూచు ఓ కవితా!

చిన్నిపూవులో, కన్నెవలపులో,
కన్నకడుపులో, మిన్నువాకలో
వన్నువిప్పు ఓ కవితా!

దోరపండులో, కేరుచిల్కలో,
ఓరచూపులో, మీరుసిగ్గులో
తారసిల్లు ఓ కవితా!

తేగగంతులో, లేడిపరుగులో,
మూగగొంతులో, రేగునూహలో
వేగిరించు ఓ కవితా!

గాలివూపులో, జోలపాటలో,
చీలుదారిలో, తూలుబ్రతుకులో
పూలుపూయు ఓ కవితా !

హిమాద్రిగళితా ! సమీరదళితా !
సుమాగ్రచలితా ! సుగంధఫలితా !
నమామి ! ఓహో ! కవితా ! !

*

పొడిమాటకు పుప్పొడిసద్దుటలో,
తడిగుండెకు పుత్తడిహత్తుటలో
వడిచూపెడి ఓ కవితా !

తడబడు నుడులకు బడి పెట్టుటలో,
విడివడు గొంతున గుడి కట్టుటలో
వడుపుచూపు ఓ కవితా !

జడివానల దూకుడు చూపుటలో,
గడియారపు తాకిడి నాపుటలో
గడుసుదనపు ఓ కవితా !

శిశిరగర్భమున చిగిరించుటలో
అశనిగర్జనల వసియించుటలో
కుశలమైన ఓ కవితా !

మధుమాసమ్ముల మంజులత్వమును,
సుధాస్రవంతుల సుందరత్వమును
పదిలపరచు ఓ కవితా !

పరభృతానికే సరళగీతులను,
శరద్రాత్రికే తరళరీతులను
గరపనేర్చు ఓ కవితా !

ఆశ నిస్పృహల ఆవేగములో,
హాసదుఃఖముల ఆవర్తములో
మోసులెత్తు ఓ కవితా !

శాంతిక్షోభల సంశ్లేషములో,
కాంతి తమస్సుల గాంధర్వములో
గొంతువిప్పు ఓ కవితా !

ప్రణయవిరహముల వక్రఖేలలో,
జననమరణముల చక్రదోలలో
తొణకుచుండు ఓ కవితా !

సుషుప్తి జాగృతుల లిప్తావధిలో,
జ్ఞప్తి విస్మృతుల తప్తాంబుధిలో
వ్యాప్తినందు ఓ కవితా!

వ్యక్తావ్యక్తర రక్తిసముద్రలో,
తిక్తమాధురీసిక్తసీమలో
శక్తిచూపు ఓ కవితా!

సృష్టజాతమున అష్టకష్టములు,
భ్రష్టనరుని సంశ్లిష్టభావములు
స్పష్టపరచు ఓ కవితా!

సృష్టిలో ప్రేమవృష్టిరీతులను,
వ్యష్టిలో మహోరిష్టభీతులను
ద్రష్టవైన ఓ కవితా!

క్రూరసంఘముల కోర వంచగా,
ధారుణీరిపుల త్రాడు తెంచగా
పోరు సలుపు ఓ కవితా!

రుద్రభూమిపై భద్రకుంభమును,
క్షుద్రజీవిపై అద్రిశృంగమును
ముద్రవేయు ఓ కవితా!

వేదఋక్కులో విశ్వశ్రేయము,
సామగీతిలో నాదబ్రహ్మము
పాడి పాలింపు ఓ కవితా !

గోపగణంతో దాశసత్తకము,
కాలరథంతో గానసౌరభము
మోహించు ఓ కవితా !

అణువులోన విశ్వాంతరాళమును,
కణములోన ఉగ్రాబ్ధిరాసులను
పంపించేయు ఓ కవితా !

జరామృతులనే పరాభవించుచు
పురాపుణ్యముల పరాకాష్ఠవా
సురాంగనా ! ఓ కవితా ! !

సమాజజనితా ! జనాళివినుతా !
అమేయమహితా ! అమోఘచరితా !
నమామి ! ఓహో ! కవితా ! !

# జీవితగీత

కేరింతలు. గిరిగింతలు.
చిట్టిపాని చిలిపిచేష్ట త్రుళ్ళింతలు
జీవితసౌభాగ్యానికి
శ్రీకరస్వాగత మౌనా ?
        ఔను ! ఔను ! నిజమౌను !!

గిలిగింతలు, కికురింతలు,
చిన్నెలాడి చిరునవ్వుల కొసరింతలు
జీవితప్రాగల్భ్యానికి
జిలుగుం సాక్ష్యం బౌనా !
        ఔను ! ఔను ! నిజమౌను !!

లాలింపులు, తేలింపులు,
కన్నతల్లి కళ్ళవెలుగు దీవింపులు
జీవితసాఫల్యానికి
పావనహారతు లౌనా ?
        ఔను ! ఔను ! నిజమౌను !!

ఇగిరింతలు, చిగిరింతలు,
కొమ్మకొమ్మ కొమరించిన పూదిండెలు
జీవితనిత్యత్వానికి
చెరుగని సూచన లౌనా ?
        ఔను ! ఔను ! నిజమౌను !!

# నిద్రాదేవి

ఇంత బెదరేలనే నిదురా ?
వింత వెఱగేలనే నిదురా ?

ఇరులలో కనువిచ్చు చిఱుమెఱపుతీవలా,
సురకాంతకబరిలో విరిదండతావిలా
దరిదాపులకు వచ్చి,
తరితీపులను తెచ్చి

ఇంత బెదరేలనే నిదురా ?
వింత వెఱగేలనే నిదురా ?

మూతపడ కన్నులను ముద్దులాడగబోయి,
చేతనమ్ములుదప్ప చెంత జేర్చగబోయి,
అడుగు వెనుకకువేయ,
ఆశోపహతుజేయ

ఇంత బెదరేలనే నిదురా ?
వింత వెఱగేలనే నిదురా ?

గగనవీథుల వచ్చి, బిగికౌగిటను గ్రుచ్చి,
చిగిరించు చంద్రికల చిత్రలోకము జేర్చి,
కామితమ్ముల గూర్చి
కలల దేల్చగ నేర్చి

ఇంత బెదరేలనే నిదురా ?
వింత వెఱగేలనే నిదురా ?

స్వర్గమర్త్యమ్ములకు స్వర్ణ సేతువు కట్టి,
సంక్షుభిత జీవులకు శాంతిభిక్షను పెట్టి
రంజించు భామవై
రక్షించు దేవివై

ఇంత బెదరేలనే నిదురా ?
వింత వెఱగేలనే నిదురా ?

అరవిందమధురోష్ఠ దరహాసరేఖగా,
వరదాయినీనేత్ర శరదిందులేఖగా
లాలించి, పాలించి,
సోలింప జాలియు

ఇంత బెదరేలనే నిదురా ?
వింత వెఱగేలనే నిదురా ?

# నరజన్మ

డొక్కల పర్వగ
రెక్కలు తే పని
బొక్కమొగమ్మును పెట్టగ నేలా ?
ముక్కడాయునె
చొచ్చుకుపోవమే
ఉక్కుమగంటిమి ఊహలు లేవా ?

చక్కగ వెలిగే
రిక్కను తా నని
అక్కరమాలిన అలమట లేలా ?
దిక్కు దిక్కులకు
దీప్తుల నిచ్చే
పెక్కు హొరంగుల ప్రేమలు లేవా ?

రెక్కలు తొడిగిన
రిక్కవు నీవే !
దిక్కుదనమ్ముల నీడవు నీవే ! !
రిక్కకు వెల్గుల
రెక్కవు నీవే !
చక్కదనమ్ముల జన్మము నీవే ! !

# జగన్నాటకం

చీకటి వెల్గులు,
ఆకలి తృప్తులు
అలలై లేచును,
కలలై పూచును

మిన్నులలో,
కన్నులలో

ఎండలు వానలు,
ఈసులు ప్రేమలు
జడలై పెనగును,
సుడులై తిరుగును

కొండలలో,
గుండెలలో

లోక మలోకము,
శోక మశోకము
కసులై విచ్చును,
ధ్వనులై రెచ్చును

పాటలలో,
బ్రతుకులలో

సత్య మసత్యము,
నిత్య మనిత్యము
హాలమై యున్నను,
పొలమై పండును
జగములలో,
యుగములలో

# పిలుపు

రావోయి! రావోయి! రాకాసుధాకరా!
రావోయి! రావోయి! రత్నదీపాకరా!!

నీవె బ్రతుకని యెంచి,
నీ పుంతలో పొంచి
కోటికోర్కెల రేయి కొసరుసిగ్గుల మించు

రావోయి! రావోయి! రాకాసుధాకరా!
రావోయి! రావోయి! రత్నదీపాకరా!!

నీ తెన్నులను కాచి,
నీ చెన్నులను దోచి
కోటికన్నుల మిన్ను మేటిసవ్వులు పూచు

రావోయి! రావోయి! రాకాసుధాకరా!
రావోయి! రావోయి! రత్నదీపాకరా!!

నీ సౌరులను మెచ్చి,
నిన్ను కౌగిటఁ గ్రుచ్చి
కోటిచేతుల కడలి కూర్మి నూయల లూచు

రావోయి! రావోయి! రాకాసుధాకరా!
రావోయి! రావోయి! రత్నదీపాకరా!!

నీతో పందెము కట్టి,
నిన్ను చెంగున పట్టి
కోటి జిలుగుల మబ్బు కులుకులను చూపెట్టు

రావోయి ! రావోయి ! రాకాసుధాకరా !
రావోయి ! రావోయి ! రత్నదీపాకరా ! !

నిను మామగా దలచి,
నీ రాకకై వేచి
కోటి ముద్దుల పాప ఆటలాడగ బిలుచు

రావోయి ! రావోయి ! రాకాసుధాకరా !
రావోయి ! రావోయి ! రత్నదీపాకరా ! !

పాలకడవను వంచి,
ప్రాణికోటికి పంచి
కోటి గుండెలలోన చోటు సంపాదించ

రావోయి ! రావోయి ! రాకాసుధాకరా !
రావోయి ! రావోయి ! రత్నదీపాకరా ! !

గతి వేరులేనట్టి
కడగొట్టు పూరింట
కోటి ప్రేమలతోడ కోరి దీపముపెట్ట

రావోయి ! రావోయి ! రాకాసుధాకరా !
రావోయి ! రావోయి ! రత్నదీపాకరా ! !

కలగన్న పాపాన
గాసిలితి లోకాన
కోటితంత్రుల వీణ మీటగా నాలోన

రావోయి ! రావోయి ! రాకాసుధాకరా !
రావోయి ! రావోయి ! రత్నదీపాకరా ! !

# ఆధిక్యం

ఒక్కెడ తిమిరము,
ఒక్కెడ వెలుతురు :
చిక్కని మాత్రము
        చిందీచిందని
చిరునవ్వదె !

మెద డొక దిక్కున,
ఎద యొక దిక్కున :
గరిమము మాత్రము
        జారీజారని
కన్నీటిదె !

అయ్యది సత్యము,
ఇయ్య దసత్యము :
స్నిగ్ధత మాత్రము
        పలికీపలకని
శిల్పానిదె !

జడ మొక చెంపను,
జవ మొక చెంపను :

విజయము మాత్రము
కూడీకూడని
బీజానిదె !

అయ్యది నిత్యము,
ఇయ్య దనిత్యము :
భవ్యత మాత్రము
కట్టీకట్టని
బంధానిదె !

బ్రతు కొక వైపున
మృతి యొక వైపున
సఫలత మాత్రము
కరగీకరగని
స్వప్నానిదె !

అజాండ మావల,
అణు వీవలగా :
పూర్ణత మాత్రము
విచ్చీవిచ్చని
పుష్పానిదె !

# సభ్య నరుడు

ఓయి ! ఓయి ! మానవా ! పచ్చి
బోయ వోయి మానవా ! !

లేదు చేత విల్లు నేడు,
లేదు విషపుబాణమైన ;
తినవు పచ్చిమాంస మిపుడు,
వినవు పులుల గర్జనమ్మ !
చార లింక చెరుగవేల ?
కోర లింక పెరుగునేల ?

ఓయి ! ఓయి ! మానవా ! పచ్చి
బోయ వోయి మానవా ! !

కొట్టినావు అడవు లన్ని,
పట్టినావు హలము చేత ;
మిన్నుముట్టు నగరు నీది,
కన్నుకుట్టు సిరులు నీవి !
దారు లింక కొట్టనేల ?
దైత్యపథము మెట్టనేల ?

ఓయి ! ఓయి ! మానవా ! వచ్చి
బోయ వోయి మానవా ! !

విద్య లెంతో విస్తరించె,
విస్తరించె శాస్త్రపరిధి ;
నిశితమయ్యె నీదు బుద్ధి,
విశదమయ్యె సృష్టిరీతి :
చేదు లింక విరుగ వేల !
ఖేద మింక తరుగ దేల ?

ఓయి ! ఓయి ! మానవా ! వచ్చి
బోయ వోయి మానవా ! !

నదులు నిలుచు నీదు సేవ,
చదల నేలు శక్తి నీది ;
శంప నీకు చరణదాసి,
శరణు చొచ్చె అణువుకూడ :
జంకు లేల యెడదలోన ?
బొంకు లేల బ్రతుకులోన ?

ఓయి ! ఓయి ! మానవా ! వచ్చి
బోయ వోయి మానవా ! !

కలవు నీకు దేగకళ్ళు,
కలవు నేడు పాముచెవులు ;
ఈదగలవు చేపవోలె,
ఎగురగలవు పులుగువోలె :
నరునివోలె బ్రతుకలేవె ?
పరుల మేలు కోరలేవె ?

ఓయి ! ఓయి ! మానవా ! వచ్చి
బోయ వోయి మానవా ! !

# "కొక్కొరొకో!"

"కొక్కొరొకో! కొక్కొరొకో!!"

చీకటి గుండెలు చెదరిపోవగా
వేకువ పెట్టిన వెలుగుకేకలా

"కొక్కొరొకో! కొక్కొరొకో!!"

జడప్రవృత్తులు గడగడ లాడగ
వడిగా దూసిన వాడిబాకులా

"కొక్కొరొకో! కొక్కొరొకో!!"

సద్దుల నెరుగని పొద్దుల కడుపున
నిద్దుర నుడిగిన పెద్ద తరగలా

"కొక్కొరొకో! కొక్కొరొకో!!"

తెల్లవారెనని పల్లెహావేలికి
వెల్లడి చేసే వెండిగంటలా

"కొక్కొరొకో! కొక్కొరొకో!!"

# కవికి...

మాటంటే కవికి
ఆటలు, గుండెల
మీటలు

పాటంటే కవికి
బాటలు, భావికి
కోటలు

నీడంటే కవికి
మేడలు, బ్రతుకుల
ఊడలు

పెల్లుంటే కవికి
చిల్లులు, బంగరు
పుల్లులు

అందమే కవికి
పందెము, జీవిత
చందము

నాదమే కవికి
మోదము, మూడవ
వేదము

గానమే కవిత
పానము, పుష్పక
యానము

లోకమే కవిత
నాకము, అనుభవ
పాకము

వలపుతే కవిత
గెలుపులు, రేపటి
పిలుపులు

న్యాయమే కవిత
ధ్యేయము, ఘన సా
ధేయము

సత్యమే కవిత
నిత్యము, సురాధి
పత్యము

తత్వమే కవిత
స్వత్వము, సదాశి
వత్వము'

# ఇల్లాలు

ఘల్లుఘల్లు నూపురం
పల్లెపూల గోపురం
ఉల్లమందు శ్రీపురం
చల్లనైన కాపురం

# నవోదయం

చీకటితెర తొలగునుతే !
ఇక నీ
వాకిట సిరి వెలుగునుతే ! !

రే పన్నది పచ్చునుతే
ఆపన్నుల మెచ్చునుతే
కన్నుల తడి నొత్తునుతే
చిన్నగ నొడి కెత్తునుతే

చీకటితెర తొలగునుతే !
ఇక నీ
వాకిట సిరి వెలుగునుతే ! !

చిత్తము చిగు రొత్తునుతే
ఎత్తుగ ధ్వజ మెత్తునుతే
సత్యము పురి విప్పునుతే
నృత్యము ధర నొప్పునుతే

చీకటితెర తొలగునుతే !
ఇక నీ
వాకిట సిరి వెలుగునుతే ! !

కత్తికి చెద పట్టునులే
క్రౌర్యము తుదముట్టునులే
ఆశలు తల లెత్తునులే
ఆర్తులు పరువెత్తునులే
చీకటితెర తొలగునులే!
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే!!

నవశకమే విరియునులే
నవ్యాభ్రము కురియునులే
న్యాయం విల నిలుచునులే
నవజీవము పిలుచునులే
చీకటితెర తొలగునులే!
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే!!

# ప్రశ్న

ఎందుకో, ఎందుకో ?
ఇంతగ
తొందర లెందుకో ?

దళములు విచ్చగ
త్వరగా తానొక          పూవై
తనరగ లేదని
తపనము జెందే          మొగ్గకు
దక్కె పెన్నిధి
తలచగ నేమిటో ?     రెక్కలు
ధర రాలుటెగా !

ఎందుకో, ఎందుకో ?
ఇంతగ
తొందర లెందుకో ?

నీరదసుందర
నిభృత స్వప్నము        నీరై
నిర్ఝరమై, నా
నిధనత బాపగ          లేదని

నిరతము చింతిల
నిలిచే దేమిటి ?     నిజముల
నీరసమేగా ?

ఎందుకొ, ఎందుకొ ?
ఇంతగ
తొందర లెందుకొ ?

పరుగులు వెట్టుచు,
సురుగులు గ్రక్కుచు,   రేపును
చరచర, బిరబిర
తరుముక పోవగ,     నేటికి
బరువుగ నాడిలో
వారిగే దేమిటొ ?     నిన్నె
నురుగుపై కాదా !

ఎందుకొ, ఎందుకొ ?
ఇంతగ
తొందర లెందుకొ ?

# నే మరణిస్తే ...

నే మరణిస్తే....
రాస్తాయండీ,
రాస్తాయి కొన్ని
పత్రికలైనా
ప్రముఖుం డొకడు
పరలోకానికి
పయనించాడని—

నే మరణిస్తే....
అంటారండీ,
అంటారు నేడు
తెలుగుజాతికే
తీరని నష్టం
వాటిల్లిందని
నోటిమాటగా—

నే మరణిస్తే....
చేస్తారండీ,
చేస్తారు, పెక్కు

ఆంధ్రసభల నా
ఆత్మశాంతికై
తడయక తెగ బా
రెడు తీర్మానం—

నే మరణిస్తే....
వస్తాయి సుమా !
వస్తాయి, కొన్ని
ప్రకటనలైనా
ప్రజాకోటి నా
స్మారకచిహ్నం
స్థాపించాలని—

నే మరణిస్తే....
రాను, నిజంగా
రాను సోదెలో
కైనా గిర్రున
అయిదారు నెలలు
తిరగకముందే
తెలుగుగడ్డపై—

నే మరణిస్తే....
ఏ నా పాటో,
ఏ యెదలోనో
చిక్కని చీకటి
చీల్చగ పెట్టిన
దీపము మాత్రమె
దీటుగ నిలుచును
నే మరణిస్తే....

# నవభారతం

ఆవహించిం
దావహించింది—
ఆదిశక్తి
మహాశక్తి
పరాశక్తి
ప్రజాశక్తి
అఖిలభారతాన్నే
ఆవహించిం
దావహించింది !
శరభ ! శరభ ! అ
శ్శరభ ! శరభ ! !
అణుపణువున ఆవేగం !
అణాండమందే ప్రచండోద్వేగం !
కలత నిద్రలో
ఉలికిపడుతున్నది ఆదికిరి !
లాలసత్వంనుంచి
తూలుతున్నది సురపురి !

కులగిరు లొక్కుమ్మడిగా
చలించిపోతున్నవి !
ఝఃఝురుగాలిలో
ఇగురాకు వలె
చలించిపోతున్నది
ఇలాతలం !
శరభ ! శరభ ! అ
శ్శరభ ! శరభ ! !
సివ మెత్తినట్టు
దివికంటు రివ్వున
పొంగిపోతున్నది
గంగాభవాని !
త్రివేణిలో
త్రిలోకభీకర
తీవ్రావర్తాల్ !
తపతిలో
తప్తకాసారాల్ !
నర్మద నడకలలో నిజ
ధర్మం తప్పిన ఔద్ధత్యం !
గౌతమి అఖండ
గర్భంలో ఆ
విర్భవించె బడబానలం !

కృష్ణాస్రవంతిలో
ఉష్ణోద్వేగం!
తుంగభద్ర మహోత్తుంగ
భంగమ్ములపై నెత్తురుజీరలు!
పెన్నానదికి
వెన్నులో పెద్దశూల!
కావేరిని కప్పుతున్నవి
ఘనాఘనాలు,
తామ్రపర్ణిని
ధరాధరాలు!
ఆవహించింది ఆదిశక్తి, మహాశక్తి,
ఆవహించింది పరాశక్తి, ప్రజాశక్తి
అఖిలభారతాన్నే
ఆవహించిం
దావహించింది!
అదిగో!
అల్లదిగో!
ఇంద్రప్రస్థంపై
ఇసుక తుపాను
ప్రయాగలో

ప్రళయ ప్రభంజనం !
ఆగ్రాపై మహోగ్ర
ధారాపాతం !
అవంతిపై
అశనిపాతం !
గౌహతిలో
ఘన ఘూకంపం !
పూనా నదినెత్తిని
పొడిచింది తోకచుక్క !
పాట్నాలో
పట్టపగతే చుక్కలు !
అయోధ్యలో
భయోత్పాతం !
కాశీ దశాశ్వమేధ
ఘట్టంలో కాకులగోల !
ఉదయపూర్ రాజమందిరాల
ఉలూకాల మహోత్సవం !
నాగపూర్ నడివీథిలో
నక్కల కూతలు !
కోణార్కలో
కుక్కల మొప్పులు !

శరభ ! శరభ ! అ
శ్శరభ ! శరభ ! !
కాళీఘట్టం మహాకాళి
కంఠీరవ గర్జన !
కాశీ అన్నపూర్ణ కరగృహీత
కలశానికి కంపం !
కంచి కామాక్షి మణి
కంధరంలో రుధిరగంధం !
మధుర మీనాక్షి
మందస్మిత వదనంలో మహాగ్లాని !
కనకదుర్గ
కలువ కంటిలో ఎర్రనిమంట !
విశ్వేశ్వరు దీర్ఘ
నిశ్వాసంలో వడగాడ్పులు !
భీమేశ్వరు విశాలఫాలంలో
భ్రుకుటీవిక్షేపం !
భద్రాచల రామ
భద్రుని గర్భాలయంలో
భైరవ ఘీంకారం !
శరభ ! శరభ ! అ
శ్శరభ ! శరభ ! !

ఇటు చూచిన,
అటు చూచిన,
ఎటు చూచిన
చిటపట మంటలతో
పెటిలిపోతున్నవి
కటికి గుండెలు !
ఇటు నటు
ఎటు చూచిన
ఫెళఫెళ ఫెళఫెళ
విరిగిపోతున్నవి
పిరికి బ్రతుకుల
పెళుచు కొమ్మలు !
పుట్టకిట్లతో కదులుతున్నవి
పూర్వపు విశ్వాసాల్ !
నిట్టనిలువునా కూలుతున్నవి
నిన్నటి విలువలు !
నష్టేట కలుస్తున్నవి
గుట్టలుగా, మిట్టలుగా
నెట్టువడిన నైచ్యాలన్ని !
శరభ ! శరభ ! అ
శ్శరభ ! శరభ ! !

విలయంబని,
ప్రళయంబని
వలవల వలవల
విలపిస్తున్నారు—
కలలకు దూరమ్మై,
చలనానికి శత్రువులై,
శిలలై, ఖిలులై
చావలేక బ్రతుకుతున్న
చచ్చుపీన్గులు!!
విలయంబని,
ప్రళయంబని
కలలకు నోచని,
కదలిక నెరుగని
శిల లెంతగ,
ఖిలు లెంతగ
విలపించిన
విలయం కా దిది, నవజీవన
చలనం!
ప్రళయం కా దిది, ప్రజాయుగ
ప్రాదుర్భావం!!

అదిగో !
అల్లదిగో !!
గడగడ
వణంకుతున్నది
వింధ్యాగ్రంపై నవయుగ
సంధ్యారాగం !
మిలమిల
మెరుస్తున్నది
హిమాచలంపై మ
హేంద్రచాపం !
ప్రాక్పశ్చిమ పర్వతాలలో
ప్రభవిస్తున్నది
ప్రణాశకరం !
కన్యాకుమారికే
కల్గుతున్నది
కళ్యాణంపై [illegible] !
విరించి విరచిస్తున్నాడు
వినూత్న కావ్యాల్ !
వల్లకాడు నయితం
పల్లవిస్తున్నది !
పూస్తున్నవి కొత్త కొత్త

పుష్పాలు పాత
సామ్రాజ్యాల
సమాధులపై !
శరభ ! శరభ ! అ
శ్శరభ ! శరభ ! !
రాజులు త
రాజులై
తరలిపోయారు !
జమీందార్లు,
జాగిర్‌దార్లు,
మాల్‌గుజార్లు
మటుమాయ మయ్యారు !
ప్రజచే జరిగింది
పట్టాభిషేకం !
చాతుర్వర్ణ్యం అనుప
చక్రం సడలిపోతున్నది !
కులతత్వ పిశాచం
తొలగి పోతున్నది !
పరశురామునికి
జరుగుతున్నది
మహాపరాభవం !

శంబుకుని
క్షమాభిక్షకై
అర్థిస్తున్నాడు
అయోధ్యారాముడు !
మనువు నడుస్తున్నాడు
మరింత వెనక్కి !
మానవుడు వెడుతున్నాడు
మహావేగంతో ముందుకు ! !
ఎక్కలేడు కుబేరు
డిక నరవాహనాన్ని !
నక్క జిత్తులతో
సాకేతం డికమీదట
స్వారాజ్యాన్ని
సంరక్షించుకో లేడు !
వేళ తప్పకుండ
వేడి వేడిగా
పంచభక్ష్యపరమాన్నాల్
తేరగా వడ్డించనందుకు
దుర్వాసుం డికమీదట
పెట్టలేడు సుమీ
పిచ్చిశాపాల్ !

హుతుడయ్యి
జితుడు కాలేదు గాంధీజీ!
పతితులైనవారు
వెతికినా కనబడని
మంచిరోజు మన
మందరం చూడబోతున్నాం!
స్వాతంత్ర్యం సంతర్పణ
జరుగుతున్నది!
సమతా సమారాధన
సాగుతున్నది!
సోషలిజం వేద
సూక్తమై చెల్లబోతున్నది!
సౌహార్దం,
సౌభ్రాత్రం
నేల నాల్గు చెరగుల
నెలకొనబోతున్నవి!
శరభ! శరభ! అ
శ్శరభ! శరభ!!
పందలాడి
భగీరథులు
ఊసరక్షేత్రాలను

ఉద్యానాలుగా చేస్తున్నారు !
వేలకొలది
విశ్వకర్మలు
మహారణ్యాలను
మయసభలుగా మార్చుతున్నారు !
ధనంజయులూ,
ధన్వంతరులు,
ధర్మవ్యాధులు
బాసటగా నిలుస్తున్నారు
భారత ప్రజానీకానికి !
పంచవర్ష
ప్రణాళికలలో
బయల్పడుతున్నవి
భావి భారత భాగ్యరేఖలు !
పల్లెపల్లెకు
ప్రాకుతున్నవి వెల్గు తీగలు !
సీమసీమలో
చిందుతున్నది నవచైతన్యం !
సింద్రీ, పెరంబూర్,
చిత్తరంజన్
కొత్తగ, ఉ

వ్యాప్తగ
వెలసిన మన కో
వెల లోయ్!
సంగల్, హీరాకుడ్,
నాగార్జునసాగర్
ఆర్తిని బాపే,
అర్థము లిచ్చే నవ
తీర్థము లోయ్!
నేటికి, ఈ
నాటికి మన,
ముంగిటలో బంగరు
ముగ్గులు!
నేటికి, ఈ
నాటికి మన
దేశంలో చిందెడి
దివ్యత్వం:
కను మదిగో!
నవభారత మహోదయం!!
విను మదిగో!
నవయుగ శంఖారావం!!!

[1957]

# "నవ్వకే! నవ్వకే!"

నవ్వకే ! నవ్వకే ! నొవ్వజేయగ మమ్ము
నవ్వకే నక్షత్రమా !
అంతరిక్షమునందు
వింతసాక్షిగ నిలిచి
నవ్వకే ! నవ్వకే ! నొవ్వజేయగ మమ్ము
నవ్వకే నక్షత్రమా !
త్రుటిపాటి సిరులకే
త్రుళ్లు బ్రతుకులు మావి ;
పొగరు మా నడకలను
పొగ లెగయు మా తల్లి—
మము జూచి, మముగన్న
మా భూదేవి జూచి
నవ్వకే ! నవ్వకే ! నొవ్వజేయగ మమ్ము
నవ్వకే నక్షత్రమా !
కుటిల విద్వేషాల
కటికబ్రతుకులు మావి ;
మా పాపపంకాల
మలినమౌ మా తల్లి—

మము జూచి మముగన్న
మా భూదేవి జూచి

నవ్వకే! నవ్వకే! నొవ్వజేయగ మమ్ము
నవ్వకే నక్షత్రమా!

కీడుగోడుల గ్రాలు
మోడు బ్రతుకులు మావి;
మా వంత గనలేక
మదిగుందు మా తల్లి—
మము జూచి, మముగన్న
మా భూదేవి జూచి

నవ్వకే! నవ్వకే! నొవ్వజేయగ మమ్ము
నవ్వకే నక్షత్రమా!

నిండు చీకటిలోనె
పండునవ్వులు నీకు—
చీకుచింతలనైన
స్నిగ్ధహాసపు విద్య
నేర్పకుండగ మాకు
నింగిపై కూర్చుండి

నవ్వకే! నవ్వకే! నొవ్వజేయగ మమ్ము
నవ్వకే నక్షత్రమా!

# చిరశత్రువు

నరునికి నరుడే చిరశత్రువురా !

అందము చిందెడి, అర్థము లిచ్చెడి

అవనీతలమున

నరునికి నరుడే చిరశత్రువురా !

స్వార్థము పెంచిన, స్పర్థలు తెచ్చిన

సంఘర్షణతో

నరునికి నరుడే చిరశత్రువురా !

మతముల పేరిట చితులను పేర్చెడి

మౌఢ్యము కతమున

నరునికి నరుడే చిరశత్రువురా !

నిన్నటి నీతులు, మొన్నటి నియతులు

నేటిని బలిగొన

నరునికి నరుడే చిరశత్రువురా !

ప్రేమము గల్గియు, క్షేమము గోరియు

తామసవశమున

నరునికి నరుడే చిరశత్రువురా !

సభ్యత హెచ్చియు, సంస్కృతి పెరిగియు

శాప మదేమో

నరునికి నరుడే చిరశత్రువురా ! !

## పిచ్చిపూహలు

పిచ్చిపూహ లేవో
రెచ్చిపోవు నాలో !

కత్తికె కన్నుంటే
నెత్తురు చూడగనే
ఒళ్లు తిరిగి ఉర్వికి
ఘల్లున పడునేమో !

పిచ్చిపూహ లేవో
రెచ్చిపోవు నాలో !

రూకకె నోరుంటే
వ్యాకుల చిత్తముతో
"కొంపలు నా పేరిట
కూల్చకు" మను నేమో !

పిచ్చిపూహ లేవో
రెచ్చిపోవు నాలో !

గోడకె చెవులుంటే
మేడల బ్రతుకులలో

గుట్టుమట్టు లెన్నిటి
రట్టుకు తేగలవో !

పిచ్చిపూవా తేవో
రెచ్చిపోవు నాలో !

రొట్టెకై కాళ్ళుంటే
పట్టెడు మెతుకులకే
అల్లాడే దీనుల
ఇల్లు చేరునేమో !

పిచ్చిపూవా తేవో
రెచ్చిపోవు నాలో !

రాతికై మమతుంటే
నాతిగ మలచగనే
తరుణశిల్పి యెదపై
ఒరిగిపోవు నేమో !

పిచ్చిపూవా తేవో
రెచ్చిపోవు నాలో !

కలకే బలముంటే
విలువలు తలక్రిందై
కవి కోరే స్వర్గము
భువికే దిగునేమో !

పిచ్చిపూహ లేవో
రెచ్చిపోవు నాలో!

నింగి జల్లెడైతే
రంగుల చుక్కలెన్ని
మాణిక్యాలై మన
మాగాణుల బడునో!

పిచ్చిపూహ లేవో
రెచ్చిపోవు నాలో!

నాకే రెక్కలున్న
ఆకాశపు టంచులు
దాటిదాటి ఏ మధు
వాటిక చేరుదునో!

పిచ్చిపూహ లేవో
రెచ్చిపోవు నాలో!

# గోమాత

గోమాతా !
నీ సుధాధారే
సృష్టికి భిక్ష !

గోలక్ష్మీ !
నీ కడుపుపంటే
పృథ్వికి రక్ష !

గోదేవి !
నీ జీవితమ్మే
కృపార్ద్రవీక్ష !

# ని శీ థి ని

ఓ నిశీథినీ! ఓ మహాయోగినీ! అ
శేషకరుణా విలాసినీ!
జీవితంపు
వేనవేల వెతలతోడ విసిగిపోయి,
శ్రాంతికై ప్రతియొక దివసాంతమందు
పరితపించు చరాచర ప్రాణికోటి
నక్కున గదించి, నీ మృదులాతి మృదుల
హస్త డోలికలందు నుయ్యాల లూచి,
నిద్రపుచ్చి, శతసహస్ర నేత్రతతిని
ప్రేమతో విప్పి, వేకువ వేళవరకు
రెప్పనైన వాల్చక తల్లిరీతి బ్రోచు
విమలచరిత వయ్యు, అదేమి విధివిపాక
మమ్మ జరతోడ, మృతితోడ, అనృతవాక్కు
తోడ, అజ్ఞానకూపమ్ముతోడ పోల్చి
నిన్ను నిరసించుచుండును నిత్య మీ కృ
తఘ్న లోకమ్ము!
రాకాసుధాకరాంశు
కలిత లావణ్యరాశీ. మృదుల దృగంచ

లా ! సుహాసినీ !

జారచోరగణములకు

నీవు ప్రీతిపాత్రవనుచు, నిను పిశాచ
బృందమే కొల్చునంచు, అఖిల దైత్య
వర్గమే నిన్ను మనసార పలచునంచు
నిరసనగ పల్కువారిలో నీ మహా గ
భీర నిశ్శబ్దతాపూర్ణ విమలచిత్త
వృత్తిపట్ల అకారణ భీతు లేహొ
దాగి, మూగి యుండు ననుట తథ్య మమ్మ !
కారుచీకటి తెరలతో కన్నుకప్పి
గ్రుడ్డితనము తెత్తువనుచు కోపగించు
కొనెడువారు కాన రదేమొ కోటికోట్ల
యోజనమ్ముల దూరాన తేజరిల్లు
దివ్యలోకాలనైన మా దృష్టిపథము
నందు నిల్పగల్గెడి విశిష్టాతిరేక
శక్తి నీకె కల దటంచు—

# ఉన్నారా?

వచ్చీరానీ మాటలు
విచ్చీవిచ్చని పూవులు
నచ్చనివా రున్నారా ? మది
మెచ్చనివా రున్నారా ?

చెరిగీచెరగని పొద్దుల,
దరిసీదరియని వొడ్డుల
కరగనివా రున్నారా ? మై
మరవనివా రున్నారా ?

ఊరీఊరని తేనెకు
ఆరీఆరని ఆశను
చేరనివా రున్నారా ? నో
రూరనివా రున్నారా ?

చిక్కీచిక్కని పండుకు,
దక్కీదక్కని ప్రేమకు
మొక్కనివా రున్నారా ? కై
పెక్కనివా రున్నారా ?

చీలీచీలని దారుల
వాలీవాలని వయసుల
తూలనివా రున్నారా ? యెద
కాలనివా రున్నారా ?

చేరీచేరని మేరల
తేరీతేరని కలకై
పోరనివా రున్నారా ? వే
సారనివా రున్నారా ?

# "ధనమూల మిదం జగత్"

నిట్టూర్పుకు,
బిట్టూర్పుకు
కట్టెదవా
కాసులతో విలు వెంతో ?

కన్నీటికి,
మున్నీటికి
వెదకెదవా
వినియోగా లేవేవో ?

చిరునవ్వుకు
చెంగల్వకు
పేర్కొందువె
మార్కెటుధర ఏమాత్రమొ ?

కవనానికి,
హవనానికి
పెట్టెదవా
చిట్టా ఆవర్జాలను ?

తరగలపై,
నురుగులపై
పంచెదవా
వాటాదార్లకు లాభం ?

తేసంజను,
వాసంతిని
పాడెదవా
వడ్డీ వ్యాపారానికి ?

# సిగ్గిలనేలా?

సిగ్గిల నేలా ? లోలో
బెగ్గిల నేలా ?

శశవిషాణమును
సాధించుటకై
కాళ్ళకు బలపము
కట్టినందులకు
సిగ్గిల నేలా ?

వేసట నెరుగక
వెదకిన వస్తువు
కలికముకైనను
కనబడలేదని
బెగ్గిల నేలా ?

అపురూపానికి
అలమట చెందక
నరుడు నరుడుగా
పెరుగనేర్చునా ?

సిగ్గిల నేలా ? లోలో
బెగ్గిల నేలా ?

గగనపుష్పమును
గాలించుటలో
కాలము సంతయు
గడపినందులకు
సిగ్గిల నేలా ?

అలసి సొలసినా,
కలయ వెదకినా
కోరినదానిని
ఆరయలేదని
బెగ్గిల నేలా ?

అందనివానికి
అర్రులు సాచక
నరుడు నరుడుగా
పెరుగ నేర్చునా ?

సిగ్గిల నేలా ? లోలో
బెగ్గిల నేలా ?

పరుసవేదికై
పరిశోధించుచు

దేశదేశములు
తిరిగినందులకు
సిగ్గిల నేలా ?
ఎక్కడ తిరిగిన,
ఎంతగ వెదకిన
పరుసవేదియే
దొరకలేదనుచు
బెగ్గిల నేలా ?
మిసిమి వేకువల
పసిడిని కోరక
నరుడు నరుడుగా
పెరుగనేర్చునా ?
సిగ్గిల నేలా ? లోలో
బెగ్గిల నేలా ?
పగటి కలలతో,
పాలనురుగుతో
గాలిమేడలను
కట్టినందులకు
సిగ్గిల నేలా ?

కట్టిన మేడలు
కట్టినంతనే
నేలమట్టముగ
కూలినందులకు

బెగ్గిల నేలా !

నింగిచివరలో
లంగరువేయక
నరుడు నరుడుగా
పెరుగ నేర్చునా ?

సిగ్గిల నేలా ? లోలో
బెగ్గిల నేలా ?

# విశ్వరూపం

వెలుగు నీడల
వియ్యమందున
చిందు నోయీ
చిద్విలాసం !

నిజానిజముల
నెయ్యమందున
పండు నోయీ
బ్రహ్మకల్పం !

తెలుపు నలుపుల
వలపులందున
ఆడు నోయీ
ఆదిసత్యం !

చావు బ్రతుకుల
సఖ్యమందున
చెలగు నోయీ
సృష్టిమర్మం !

రేయి పవళుల
తీయమందున
వెలుగు నోయీ
విశ్వరూపం !

# మంటలు

మంటలు ! మంటలు !
మంటలు ! మంటలు ! !

రవ్వల జిమ్మే
రవరవ మంటలు !
మిన్నుల కెగసే
మిలమిల మంటలు !
చీలిన నాల్కల
చిటపట మంటలు !

మంటలు ! మంటలు !
మంటలు ! మంటలు ! !

పొగలను లేపే
భగభగ మంటలు !
సెగలను కక్కే
భుగభుగ మంటలు !
జగములు నిండే
ధగధగ మంటలు !

మంటలు ! మంటలు !
మంటలు ! మంటలు ! !

పొయ్యి పొయ్యిలో
పొటిపొటి మంటలు!
కొలిమి కొలిమిలో
కొరకొర మంటలు!
నెగడి నెగడిలో
నిగనిగ మంటలు!

మంటలు! మంటలు!
మంటలు! మంటలు!!

అడవి నడిమిలో,
కడలి కడుపులో,
కొండ చరియలో,
గుండె మడతలో,
మింటి వంపులో,
కంటి లోతులో

మంటలు! మంటలు!
మంటలు! మంటలు!!

వెల్గుల, జిల్గుల
వెచ్చని మంటలు!
చిందుల, విందుల
అందపు మంటలు!

రంగుల, పొంగుల
బంగరు పంటలు !

మంటలు ! పంటలు !
మంటలు ! పంటలు ! !

కాల్చే, కూల్చే
కక్షల మంటలు,
చీల్చే, చెండే
చింతల మంటలు,
మింగే, మెసవే
మిండరి మంటలు !

మంటలు ! మంటలు !
మంటలు ! మంటలు ! !

కల్ల బ్రతుకులను
రెల్లు గడ్డిలా
కాల్చే మంటలు !
వల్లకాటితో
ఎల్లరి నేకము
చేసే మంటలు !

మంటలు ! మంటలు !
మంటలు ! మంటలు ! !

యమలోకమ్మున
హాహారవములు
రేపే మంటలు !
మూడవ కంటిని
ముల్లోకమ్ముల
మాడ్చే మంటలు !

మంటలు ! మంటలు !
మంటలు ! మంటలు ! !

ఆకలి దప్పుల
దూకుడు మంటలు !
మోహా కామముల
ముట్టడి మంటలు !
ఈర్ష్యాభయముల
ఎరగొను మంటలు !

మంటలు ! మంటలు !
మంటలు ! మంటలు ! !

తీరని కోర్కెల
తియ్యని మంటలు !
ఆరని ఆశల
ఆమని మంటలు !

చేరని తీరం
చిత్రపు మంటలు !
మంటలు ! మంటలు !
మంటలు ! మంటలు ! !
జాతి భేదముల
ఘాతల మంటలు !
యుద్ధ భయమ్ముల
ఉద్ధతి మంటలు !
అణ్వాస్త్రమ్ముల
ఆహుతి మంటలు ! !
మంటలు ! మంటలు !
మంటలు ! మంటలు ! !

# స్తోమత

వినగలవానికి
వినిపించునురా
వినువీధులలో
వీణారావం !

కనగలవానికి
కనిపించునురా
మునిమాపులలో
పినాకినృత్యం !

చవిగలవానిని
కవియించునురా
చంచల నేత్రాం
చల మృదుహాసం !

ఎదగలవానిని
కదలించునురా
మూక వేదనల
శోకావేగం !

కలగనువానిని
పలికించునురా
ఇలాతలముపై
వెలయని సత్యం !

పసగలవానిని
పలికించునురా
ఊహల కందని
ఉదాత్తలోకం !

